# 108 నామాల్లో సంపూర్ణరామాయణం







ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

# 108 నామాల్లో సంపూర్ణ రామాయణం



రచన
"ప్రవచన ప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బ్రహ్మశ్రీ **జి.వి.యస్.సుబ్రహ్మణ్యశర్మ,** ఎం.ఏ.,

ప్రచురణ :
శ్రీ శాంతి ఆశ్రమం - ది మిషన్ ఆఫ్ పీస్
శ్రీ శాంతి ఆశ్రమం (పోస్టు)
(వయా) శంఖవరం - 533 446
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్ : 08868 - 244266

**ఈ పుస్తకము శ్రీమతి సంకా విజయలక్ష్మి & మిత్రబృందం బెంగుళూరు వారి ఆర్థిక సాయంతో ముద్రింపబడినది. వారికి, వారి కుటుంబ సభ్యులందరికి శ్రీ సీతారామచంద్రుల అనుగ్రహము, శ్రీస్వామివారి ఆశీస్సులు సదా లభించుగాక !**

ముద్రణ నిర్వాహణ :
**మోహన్ పబ్లికేషన్స్**
**కోటగుమ్మం, రాజమండ్రి -1.**
WWW.MOHANPUBLICATIONS.COM





నా జన్మదినము మీ జన్మదినము
మీ అందరకు 110వ జన్మదిన శుభాకాంక్షలు
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు
**- స్వామి ఓంకార్**
తేదీ : 21-1-2004





రచయిత :
**శ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ**
వైస్ ప్రిన్సిపాల్, రీడరు, సంస్కృత శాఖాధ్యక్షులు (రిటైర్డ్)
మిసెస్ ఏ.వి.యన్. కళాశాల, **విశాఖపట్నం.**

## ముందుమాట

మన ఆర్ష సంస్కృతికి ఇతిహాస, పురాణాలే మూలాలు. కనుక వానిని నిత్యం స్మరించుకోవటం భారతీయులందరికి ఒక సంప్రదాయం అయిపోయింది. శ్రీమద్రామాయణం కేవలం కథమాత్రమేకాక, ఆధ్యాత్మిక సందేశాన్ని కూడా అంది స్తుంది. బ్రహ్మతత్త్వాన్ని అందజేయ టానికి "బ్రహ్మ" పదములోని పైఅక్షరాలను మాత్రమే స్వీకరిస్తూ "బహ" కథ ప్రవహిస్తూ ఉంటుంది. కొంచెం లోతుకుదిగి ఈ"బ్రహ్మ" పదంలోని క్రింది రెండక్షరాలు పరిశీలిస్తే అవి "రామ"బ్రహ్మతత్త్వాన్ని అంద జేస్తాయి. ఆ బ్రహ్మోపాసనమే మోక్షసాధన మార్గము. కనుక సాధకులం దరు సిద్ధిని పొందేటందుకును, జీవులందరు సుఖశాంతులను పొందేటందుకును శ్రీమద్రామాయణాన్ని విధిగా పారాయణం చేయాలి. ఈ పారాయణకు సమయము దొరకునా? అనికొందరు సందేహపడు తుంటారు. సమయాన్ని కల్పించుకోవలసినది మనమేకాని, వేరుగా సమయము ఎక్కడి నుండి ఊడిపడదు. అందువలననే మన పూర్వులు గృహముల యందలి నిత్యకృత్యములను యథావిధిగా చేసుకుంటూనే, ఆధ్యాత్మిక సాధనను కూడా విధినిర్వహణతోపాటే కొనసాగించే వారు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశమే "మా మనుస్మర, యుధ్యచ" అనువాక్యమే వారికి మార్గదర్శకమైనది. అందువలననే మనపూర్వికులు ఇంటి పనులను చేసుకుంటూనే రామాయణ, భాగవతాది గ్రంథముల యందలి ముఖ్య ఘట్టాలను పాడుకొనేవారు. అలా పాడుకొనే గీతాలలో "నామ రామాయణం" ఒకటి. రామాయణ కథను రామనామాలతో జోడించి, తేలికగా తక్కువ సమయంలో పాడుకొనే అవకాశాన్ని కలిగి స్తుంది ఈ నామరామాయణం.

వాల్మీకి శ్రీమద్రామాయణాన్ని 24వేల శ్లోకాలలో రచించాడు, దానినిపూర్తిగా ప్రతిరోజు పారాయణం చేయటం ఎవరికీసాధ్యం కాదు.



పైగా శ్రీమద్రామాయణం పారాయణం చేయటానికి చాలా నియమా లున్నాయి. కనుకనే చాలమంది ఈ రామాయణ పారాయణం చేయటం మానుకున్నారు. అత్యధిక శాంతి సుఖాలను అవలీలగా అందించే ఈరామాయణ పారాయణాన్ని జనులందరికి అందుబాటు లోకి తేవాలని ఉదారులు, మహాత్ములు అయిన మన పెద్దలు ఈ రామాయాణాన్ని 108పాదములలోనికి సంక్షేపించి మన కందించారు. ఈనామరామాయణ పారాయణానికి అంతగా నియమనిష్ఠలు అవసర ములేదు. భక్తిఉంటేచాలు, ఆసక్తి ఉంటేచాలు, అవకాశాన్ని మనమే కల్పించుకొని ఎవ్వరైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా, హాయిగా పారాయణం చేసుకోవచ్చు. ప్రతిపాదంలోను, శ్రీరాముని రూప,లీలా,గుణ, వైభవా దులను వివరించే శ్రీరాముని నామము ఉంటుంది కనుక, దీనికి నామ రామాయణం అనిపేరు పెట్టారు. ఇన్ని విషయాలను గమనించి, శ్రీశాంతి ఆశ్రమము భక్తులు తమ సత్సంగములో ప్రతి ఏకాదశినాడు విధిగా ఈ నామరామాయణంను పారాయణం చేయాలి అని ఒక నియమాన్ని పెట్టుకొని, చదువు తున్నారు. కేవలం పారాయణంచేసే కంటె, దాని అర్థంకూడ తెలిసికొని, చదువుతున్నారు. కేవలం పారాయ ణం చేసే కంటె దానిఅర్థం కూడ తెలిసికొని, పారాయణంచేస్తే ఫలితం ఇంకా ఎక్కువగా లభిస్తుందనే ఉద్దేశంతో ఈ నామ రామాయణానికి అర్థాన్ని వ్రాయుడని నన్ను కోరినారు. త్యాగరాజస్వామిపాడిన "తెలిసి రామచింతన చేయవే ఓమనసా" అన్న భావానికి అనుగుణముగా లఘువాక్యాలలో ఈనామాలకు అర్థాన్ని సమకూర్చాను. ప్రతి నామ మునకు అర్థాన్ని చెప్తూ రామాయ ణంలోని ఏ ఘట్టాన్ని సూచిస్తుందో కూడ, ఈ వ్యాఖ్యానములో వివరించాను. ఇందలి అంశములను తెలిసికొని, పారాయణంచేసి, అందరు తరింతురని ఆశించుచున్నాను.

–రచయిత



## ⋺ గ్రంథ ప్రత్యేకత ⋲

సాంప్రదాయికముగా చదువు ఈ స్తోత్రములో ఉన్న కొన్ని నామములను కథా సందర్భమునుబట్టి ఈ పుస్తక ములో కొన్ని మార్పులను చేసితిని. పాఠకులు గమనింప ప్రార్థన. అవి : 1. నావికథావిత మృదుపదరామ అనే15వ నామము బాలకాండలో ఉన్నది. కాని ఆ కథ బాలకాండలో కాక అయోధ్య కాండలో వచ్చును. కనుక ఆ నామమును అయోధ్యా కాండములోనికి 27వ నామముగా మార్చితిని. అందువలన 15 నుండి 27 వరకు గల నామముల సంఖ్య మారును. 2. ఈ నామరామాయణమునందలి నామము లన్నియు మూడేసి చతుర్మాత్రా గణములతోను చివరకు 'రామ' అను సంబోధనాత్మక పదముతోను కూర్చబడినది. కొన్నిచోట్ల నామములు తాళానుగుణముగా, లేక ఛందో భంగమును కలిగించినట్లనిపించును. అట్టి నామమును ఎట్లు దిద్దుకోవలెనో కుండలీ కరణములో చూపితిని. ఉదాహరణమునకు 59వ నామము "సీతావేదిత కాకావన (కాకప)" ఈ నామరామాయణ స్తోత్రమునందు బాల కాండలో 21 నామములు. అయోధ్యకాండలో 13 నామ ములు, అరణ్య కాండలో 14 నామములు, కిష్కింధా కాండలో 5 నామ ములు, సుందరకాండలో 8 నామములు,



యుద్ధకాండలో 25 నామములు, ఉత్తర కాండలో 22 నామములు ఉన్నవి మొత్తము మీద 108 నామములు ఉన్నవి. కావున అన్ని కాండలు అందరకు అవగాహన కాగలవని ఆశిస్తున్నాను. ఇంతేకాక మొదట పారాయణ దారుల సౌకర్యము కొరకు 108 నామాలు ప్రత్యేకముగా ముద్రించిన బాగుండునని తలచి వానిని ముద్రించు చున్నాను.

కావున పారాయణదారులు సులభముగా ముందు పారా యణ గావించి, విడిగా అర్థములు గ్రహించవచ్చు. లేదా పారాయణము – అర్థము ఒకేసారి పఠించునట్లు పుస్తక ప్రచురణ గావింపబడినది.

ఎల్లరకూ శ్రీ సీతారామచంద్రుల అనుగ్రహము లభించి సుఖశాంతులతో జీవన యాత్ర సాగింతురు గాకయని నా ప్రార్థన.

–రచయిత

# శ్రీ నామ రామాయణము

## బాలకాండము

1. శుద్ధబ్రహ్మపరాత్పర రామ!
2. కాలాత్మకపరమేశ్వర రామ!
3. శేషతల్పసుఖనిద్రిత రామ!
4. బ్రహ్మాద్యమరప్రార్థిత రామ!
5. చండకిరణకులమండన రామ!
6. శ్రీమద్దశరథనందన రామ!
7. కౌసల్యాసుఖవర్ధన రామ!
8. విశ్వామిత్రప్రియధన రామ!
9. ఘోరతటాకాఘాతక రామ !
10. మారీచాదినిపాతక రామ !
11. కౌశికమఖసంరక్షక రామ !
12. శ్రీమదహల్యోద్ధారక రామ !
13. గౌతమమునిసంపూజిత రామ !
14. సురమునివరగణసంస్తుత రామ !
15. మిథిలాపురజనమోహక రామ !
16. విదేహమానసరంజక రామ !
17. త్ర్యంబకకార్ముకభంజక రామ !
18. సీతార్పితవరమాలిక రామ !
19. కృతవైవాహికకౌతుక రామ !
20. భార్గవ దర్పవినాశక రామ !
21. శ్రీమదయోధ్యాపాలక రామ !



## అయోధ్యా కాండము

22. అగణితగుణగణభూషిత రామ !
23. అవనీతనయాకామిత రామ !
24. రాకాచంద్రసమానన రామ !
25. పితృవాక్యాశ్రితకానన రామ !
26. పియగుహవినివేదితపద రామ !
27. నావికధావితమృదుపద రామ !
28. తత్క్షాళితనిజమృదుపద రామ !
29. భరద్వాజముఖానందక రామ !
30. చిత్రకూటాద్రినికేతన రామ !
31. దశరథసంతతచింతత రామ !
32. కైకేయీతనయార్థిత రామ !
33. విరచితనిజపితృకర్మక రామ !
34. భరతార్పిత నిజపాదుక రామ !

## అరణ్య కాండము

35. దండకవనజనపావన రామ !
36. దుష్టవిరాధవినాశన రామ !
37. శరభంగసుతీక్ష్ణార్చిత రామ !
38. దుష్టవిరాధవినాశన రామ !



39. గృధ్రాధిపసంసేవిత రామ !
40. పంచవటీతటసుస్థిత రామ !
41. శూర్పణఖార్తివిధాయక రామ !
42. ఖరదూషణముఖసూదక రామ !
43. సీతాప్రియహరిణానుగ రామ !
44. మారీచార్తికృదాశుగ రామ !
45. వినష్టసీతాన్వేషక రామ !
46. గృధ్రాధిపగతిదాయక రామ !
47. శబరీదత్తఫలాశన రామ !
48. కబంధబాహుచ్ఛేదన రామ !

## కిష్కింధా కాండము

49. హనుమత్సేవితనిజపద రామ !
50. నతసుగ్రీవాభీష్టద రామ !
51. గర్వితవాలిసంహారక రామ !
52. వానరదూతప్రేషక రామ !
53. హితకరలక్ష్మణసంయుత రామ !

## సుందరకాండము

54. కపివరసంతతసంస్మృత రామ !
55. తద్గతివిఘ్నధ్వంసక రామ !



56. సీతాప్రాణాధారక రామ !
57. దుష్టదశాననదూషిత రామ !
58. శిష్టహనూమద్భూషిత రామ !
59. సీతావేదితకాకావన (కాకప)రామ !
60. కృతచూడామణిదర్శన రామ !
61. కపివరవచనాశ్వాసిత రామ !

## యుద్ధ కాండము

62. రావణనిధన ప్రస్థిత రామ !
63. వానరసైన్యసమావృత రామ !
64. శోషితసరిదీశార్థిత రామ !
65. విభీషణాభయదాయక రామ !
66. పర్వతసేతునిబంధక రామ !
67. కుంభకర్ణశిరశ్ఛేదక రామ !
68. రాక్షససంఘవిమర్దక రామ !
69. అహిమహిరావణచారణ రామ !
70. సంహృతదశముఖరావణ రామ !
71. విధిభవముఖసురసంస్తుత రామ !
72. ఖస్థితదశరథవీక్షిత రామ !
73. సీతాదర్శనమోదిత రామ !
74. అభిషిక్తవిభీషణనత రామ !

75. పుష్పకయానారోహణ రామ !
76. భరద్వాజాభినిషేవణ రామ !
77. భరతప్రాణప్రియకర రామ !
78. సాకేతపురీభూషణ రామ !
79. సకలస్వీయసమానత రామ !
80. రత్నలసత్పీఠస్థిత రామ !
81. పట్టాభిషేకాలంకృత రామ !
82. పార్థివకులసమ్మానిత రామ !
83. విభీషణార్పితరంగక రామ !
84. కీశకులానుగ్రహకర రామ !
85. సకలజీవసంరక్షక రామ !
86. సమస్త లోకాధారక రామ !

**ఉత్తర కాండము**

87. ఆగతమునిగణసంస్తుత రామ !
88. విశ్రుతదశకంఠోద్భవ రామ !
89. సీతాలింగననిర్వృత రామ!
90. నీతిసురక్షితజనపద రామ !
91. విపినత్యాజితజనకజ రామ !
92. కారితలవణాసురవధ రామ !



93. స్వర్గతశంబుక సంస్తుత రామ !
94. స్వతనయకుశలవవందిత రామ !
95. అశ్వమేధక్రతుదీక్షిత రామ !
96. కాలావేదితసురపద రామ !
97. ఆయోధ్యకజనముక్తిద రామ !
98. విధిముఖవిబుధానందక రామ !
99. తేజోమయనిజరూపక రామ !
100. సంసృతిబంధవిమోచక రామ !
101. ధర్మస్థాపనతత్పర రామ !
102. భక్తిపరాయణముక్తిద రామ !
103. సర్వచరాచరపాలక రామ !
104. సర్వభవామయవారక రామ !
105. వైకుంఠాలయసంస్థిత రామ !
106. నిత్యానందపదస్థిత రామ !
107. రామ రామ జయ రాజారామ !
108. రామ రామ జయ సీతారామ !

-000-



## ప్రార్థన

భయహర మంగళ దశరథరామ !
జయ జయ మంగళ సీతారామ !
మంగళకర జయ మంగళరామ !
సంగతశుభవిభవోదయ రామ !
ఆనందామృతవర్షక రామ !
ఆశ్రితవత్సల జయ జయ రామ !
రఘుపతి రాఘవ రాజారామ !
పతితపావన సీతారామ !

రామ ! రామ ! జయ రాజా రామ !
రామ ! రామ ! జయ సీతారామ !
హరిః ఓం తత్సత్ !





## 108 నామాల్లో సంపూర్ణరామాయణము

**1. శుద్ధబ్రహ్మపరాత్పర రామ !**

**అర్థము : ఓ శుద్ధబ్రహ్మమా! పరాత్పరుడా! రామా! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : పైకి ఇందులో ఉన్నది రామకథయే. అయినను ఆ రాముడు సామాన్యవ్యక్తి, సాధారణవ్యక్తి కాడు. మరి ఎవరు? అని అలోచిస్తే అతడు శుద్ధబ్రహ్మ స్వరూపుడు, గుణసంగము, మాయాసంగము కలిగిఉన్న ఆత్మ, పురుషుడు అగును. సామాన్య వ్యక్తి అగును. కాని రాముడు ఆ త్రిగుణసంగము, మాయా సంగము లేని గుణాతీతుడు, మాయాతీతుడు అయినవాడు. పైగా అన్నిటికంటె, అందరి కంటె పెద్దవాడు. అందువలన శ్రీరాముడు శుద్ధబ్రహ్మ అయినాడు. మనకంటె ఉన్నత స్థితియందున్నవారు (పరులు) దేవతలు. శ్రీరాముడు ఆ పరులైన దేవతలకంటె పరుడు=ఉత్తముడైనవాడు.కనుక శ్రీరాముడు పరాత్పరుడైనాడు.

**2. కాలాత్మక పరమేశ్వర రామ !**

**అర్థము : ఓ కాలస్వరూపుడా ! పరమేశ్వరుడా ! ఓ శ్రీరామా ! నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : శ్రీరాముడు కాలస్వరూపుడు, కాలా తీతుడు, కనుక కాలాధీనులమైన మనకంటె గొప్ప వాడు. ఈశ్వరు డనగా నియమించు శక్తికలవాడు. జీవులకు ఈశ్వరత్వము పరిమితము. అంటే దేవతల ఈశ్వరత్వము కూడా మన కంటె గొప్ప దైనను పరిమిత మైనదే. కాని శ్రీరాముని ఈశ్వరత్వము అపరిమితము, అనంతము, పరమము. అందువలన శ్రీరాముడు పరమేశ్వరుడు అయినాడు.

**3. శేషతల్ప సుఖనిద్రిత రామ !**

**అర్థము : ఆదిశేషుని పక్కవై సుఖముగా నిద్రిం చిన ఓ శ్రీరామా! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : ఎవరికైనను నిద్రసుఖము నిచ్చును. ఆ నిద్రా సుఖము పడుకొని ఉన్న పక్కమీద ఆధారపడి ఉండును. శ్రీరాముడు అవతరింపకముందు శ్రీమహా విష్ణువుగా ఉండి, ఆదిశేషుని పడకగాచేసికొని, సుఖ ముగా నిద్రించుచుండును. ఆదిశేషుని శరీరము మెత్తగా ఉం డును. చల్లగా ఉండును. తన శరీరమును చుట్టలు చుట్టి, శ్రీమహావిష్ణువు పరుండుటకై విశాలమైన పడకగా తయారు చేయును. శేషుని రంగుతెలుపు కనుక అది తెల్లని పక్క. సుఖనిద్రకు ఉపకరించుటకు పడకకు కావలసిన 1.



మెత్తదనము 2. చల్లదనము 3. తెల్లదనము 4. వైశా ల్యము 5. ఎత్తుదనము అను ఐదు గుణములు శేషశయన మునకు ఉన్నవి. ఈ పద కనే సంప్రదాయజ్ఞులు పంచ శయనము అందురు. పంచశయ నము మీద పరుండి ఉన్న రాముడు సుఖనిద్రను పొంద ననుటలో ఎట్టి సందేహము లేదు.

ఈ నామమునందు శ్రీమహావిష్ణువు శ్రీరాము డుగా అవతరించుటకు దారితీసిన పరిస్థితి సూచింప బడినది. రావణుని దురాగతములను భరింపలేని దేవతలు, ఋషులు, శేషశయనముమీద సుఖనిద్ర నొందుచున్న శ్రీ మహావిష్ణువును సమీపించి, భూలోకమునందు అవత రింపుమని ప్రార్థించిన నామము ఇది. ఈ నామము నుండి రామాయణకథ ఆరంభమైనది. 1,2 నామములు శ్రీరాముని ప్రార్థించుటకై వ్రాయబడినవి.

**4. బ్రహ్మాద్యమరప్రార్థిత రామ !**

**అర్థము : బ్రహ్మామొదలగు దేవతలచేత రావ ణుని వధించుటకై భూలోకమునందు అవతరింప వయ్యా అని ప్రార్థింపబడిన ఓ శ్రీరామా ! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



**5. చండకిరణకులమండన రామ !**

**అర్థము : సూర్యవంశమునకు అలంకారముగా శ్రీరాముడుగా అవతరించిన ఓస్వామీ! నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : దేవలోకమున పుట్టుకయే ఉండదు. కనుక వారిలో కులముల ప్రసక్తియే యుండదు.కాని పుట్టుకయే లేని విష్ణువు భూలోకమునందు అవతరింప వలసినచో ఈ లోకపు నియమములనుబట్టి ఒక కులము వంశము కావలసివచ్చినది. దేవతల ప్రార్థన లచే అవతరింపదలచిన శ్రీమహావిష్ణువు శ్రీరామావ తారములో చండకిరణకుల మున (సూర్యవంశమున) అవతరించినాడు. ఆ వంశపు కీర్తి ప్రతిష్ఠలను పెంచినాడని భావము.

**6. శ్రీమద్దశరథనందన రామ !**

**అర్థము : శ్రీమంతుడైన దశరథ మహారాజు యొక్క కుమారుడైన ఓ శ్రీరామా ! నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : భూలోకమునందు అవతరింపదలచిన పర మాత్మునకు వంశముతో పనిపడినట్లే తల్లితండ్రులు కూడ కావలసివచ్చిరి. అందువలన ఈ నామమునందు దశ రథుడు అనగా ధనముగల దశరధుడు అని అర్థముకాదు.



శ్రీ అనగా భగవత్ సంబంధము, భగవదనుగ్రహము అని అర్థము. భగవదనుగ్రహముచే శ్రీమహావిష్ణువు దశరథునకు కుమారుడుగా అవతరించినాడు. ఈ అనుగ్రహమే దశరథుని శ్రీరామునకు తండ్రిగా చేసినది. అందువలన దశరథుడు శ్రీమంతు డైనాడు.

**7. కౌసల్యా సుఖవర్ధన రామ !**

**అర్థము : తల్లియగు కౌసల్యకు కుమారుడవై, ఆమెకు ఆనందమును పెంపొందింపజేసిన ఓశ్రీరామా! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : వాస్తవమునకు లేని పితృసంబంధమును 7వనామము శ్రీరామునకు కల్పించిచెప్పినట్లే, ఈ నామము మాతృసంబంధమును సూచించును. ఈవిష యముచే వాల్మీకి కౌసల్యానందవర్దనః అనిపేర్కొని నాడు.

**8. విశ్వామిత్రప్రియధన రామ!**

**అర్థము : శిష్యరూపమున, సాధనరూపమున విశ్వా మిత్రునకు ఇష్టమైన ధనమైనవాడా ! శ్రీరామా! నిన్ను స్తుతించుచున్నాను కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య: శ్రీరామునికి బాల్యావస్థ గడిచినది. వసి ష్ఠునియొద్ద విద్యాభ్యాసము ముగిసినది. ఇక,అవతార కార్యక్రమమును ప్రారంభింపదలచినాడు. శ్రీరాముడు

సీతాపహరణము ద్వారా రావణ సంహారముచేసి, శ్రీరామా వతార కార్యక్రమమును నిర్వహించినాడు. రావణుడు సీతను అపహరింపవలెనన్నచో శ్రీరాముడు సీతను చేపట్ట వలెను. దానికి నాంది పలికినాడు విశ్వా మిత్రుడు. విశ్వా మిత్రునకు సర్వార్థసాధకమైన, ప్రియమైన ధనము శ్రీరాము డేనట. విశ్వామిత్రుని యజ్ఞ రక్షణమునకును అతని నుండి బలాతి బలలు అను విద్యలను స్వీకరించుటకును సాధన మైనవాడు శ్రీరాముడు.

**9. ఘోరతాటకాఘాతక రామ !**

**అర్థము : క్రూరురాలైన తాటక అను రాక్షసిని సంహ రించిన వాడా ? శ్రీరామా! నిన్ను స్తుతించుచున్నాను కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య: ధర్మస్థాపనమునకును, సత్కర్మాచరణము నకును శ్రేయాంసి బహు విఘ్నాని అన్నట్లు ఎన్నో అడ్డం కులు ఏర్పడుచుండును. శ్రీరాముని ధర్మస్థాపన కార్యక్రమ మునకు మొట్టమొదటగ తగిలిన అడ్డును, ఘోరమైన తాటక అనురాక్షసి కలిగించినది. దుష్టులను సంహరించు టయు, ఎంతటి పెద్ద ఆపదనైనను నశింప జేసి, సుఖ శాంతులను నెలకొల్పుటయును భగవంతుని లక్ష్యము.



**10. మారీచాదినిపాతక రామ !**

**అర్థము : మారీచుని అవలీలగా దూరముగా విసిరి వేసిన ఓ శ్రీరామా ! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : విఘ్నములను నశింపచేయుటయే భగవం తుని కర్తవ్యము అని తెలిసికొంటిమి కదా. శ్రీరాముని ధర్మస్థాపనమార్గములో అడ్డుతగిలిన రెండవ విఘ్నము తాటక కుమారుడైన మారీచుడు అను రాక్షసుడు. అతనిని పారద్రోలిన వృత్తాంతము నీ నామము సూచించుచున్నది.

**11. కౌశికమఖసంరక్షక రామ !**

**అర్థము : ధర్మాత్ముడైన తపశ్శాలియైన, విశ్వా మిత్రుని యజ్ఞమును రాక్షసుల బారినుండి రక్షించినవాడా! శ్రీరా ముడా ! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

వ్యాఖ్య : దుష్టశిక్షణము, శిష్టరక్షణము, ధర్మ స్థాపనము భగవదవతారమునకు ముఖ్యప్రయోజన ములు. పై 9,10 నామములలో దుష్టశిక్షణము వివరింపబడినది. ఈ నామ మునందు శిష్టరక్షణము సూచింపబడినది.



**12. శ్రీమదహల్యోద్ధారక రామ !**

**అర్థము : శ్రీమత్=భగవద్భక్తిగల, భగవత్‌దాసి యైన, అహల్య అను గౌతముని భార్యను శిలారూపశాపము నుండి ఉద్ధరించిన ఓరామా! నిన్ను స్తుతించుచున్నాను. నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : విశ్వామిత్రుని యజ్ఞమును రక్షించిన తర్వాత రామలక్ష్మణులు జనకమహారాజు యొక్క నగర మైన మిథిలకు బయలుదేరిరి. దారిలో గౌతమాశ్రమ మునకు చేరి, అచ్చట భర్తయొక్క శాపముచే శిలగామారి యున్న అహల్యను శాపమునుండి ఉద్ధరించిన కథ ఈ నామము నందు ప్రతిపాదింపబడినది. ఈ నామము నందు భగవం తుని అఘటన ఘటనా చాతుర్యము వివరింపబడినది.

**13. గౌతమమునిసంపూజిత రామ !**

**అర్థము : గౌతమ మహర్షిచే బాగుగాసేవింప బడిన ఓ రామా ! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : అహల్యను శాపమునుండి ఉద్ధరించి ఆమె భర్త వద్దకుచేర్చగా, ఆమె భర్తయగు మహర్షి గౌతముడు శ్రీరాముని సేవించి, స్తుతించిన వృత్తాంతము ఇందు చెప్ప బడినది. ఋషీశ్వరులే సేవింపదగినవారు. అట్టి ఋషిచే



శ్రీరాముడు సేవింపబడినాడన్నచో శ్రీరాముని మాహా త్మ్యము ఎట్టిదో మనము ఊహించు కొనవలెను.

**14. సురమునివరగణ, సంస్తుత రామ !**

**అర్థము : గౌతముడు ఒక్కడేకాదు, సురులు= దేవ తలు, మునివర=మునిశ్రేష్ఠులయొక్క, గణ=దండ కారణ్య మునందున్న ఋషీశ్వర బృందముచే ప్రస్తుతింప బడిన ఓ శ్రీరామా ! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : శ్రీరాముని మహత్త్వమును గుర్తించి సేవించినవారిగురించి ఈనామమునందు చెప్పబడినది.

**15. మిథిలాపురజనమోహన రామ !**

**అర్థము : మిథిలాపురములోని జనులందరిని నీ సౌందర్యముతో మోహపరచిన ఓ రామా! నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : పెండ్లికొడుకునకు ఉండవలసిన రూప సౌందర్యము ఇందు వివరింపబడినది. అహల్యను శాపము నుండి ఉద్ధరించి, జనకుని రాజధానియగు మిథిలాపుర మును రామలక్ష్మణులు ప్రవేశించెను. అందలి పురజను లందరు వారిని చూచిరి. శ్రీరాముడు తన దివ్యసౌందర్య ముతో ఆ పురప్రజలందరిని మోహపరచి, ఆకర్షించిన వృత్తాంతము ఇందు ఉన్నది.

**16. విదేహమానసరంజన రామ !**

**అర్థము : పెండ్లికుమారుడు శ్రీరాముడుగా, నీకు కాబోవు మామగారుఅగు విదేహ మహారాజుయొక్క (1.విదేహపట్టణమునకు రాజైన, 2. శరీరభావనయే లేని మహాజ్ఞానియైన) మనస్సును రంజింపజేసిన లోకోత్తర సుందరుడా శ్రీరామా! నిన్నుస్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : దేహభావనలేని ఐహికవిముక్తుడైన జన కుని మనస్సుచే రంజింపజేసిన శ్రీరాముని సౌంద ర్యము అప్రమేయమైనదని ఇందలి భావము.

**17. త్ర్యంబకకార్ముకభంజన రామ !**

**అర్థము : త్ర్యంబక=మూడుకన్నులుకల శివుని యొక్క, కార్ముక=వింటిని, భంజన=విరుగగొట్టిన ఓ రామా! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

వ్యాఖ్య : సీతాకళ్యాణమునకై రాముడు చేసిన శివ ధనుర్భంగ వృత్తాంతము ఇందు సూచింపబడినది.

**18. సీతార్పితవరమాలిక రామ !**

**అర్థము : శివధనుర్భంగమును చేయగానేజనకుని అజ్ఞమేరకు సీత, స్వయంవరమాలికనుతెచ్చి శ్రీరాముని**



**మెడలోవేయగా, దానితో వెలుగొందు ఓ రామా!నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : సీతాస్వయంవరోత్సవము ఈ నామము నందు సూచింపబడినది. ఈ నామమునందు "సీత అర్పిం చిన మాలను స్వీకరించినవాడా"అనుటచే సీతవలె జీవులు ఆత్మసమర్పణముచేసినచో భగవంతుడు దానిని స్వీకరించు నను సూచన ఉన్నది.

**19. కృతవైవాహికకౌతుక రామ !**

**అర్థము : స్వయంవరము అయిన తరువాత, కళ్యాణ ముహూర్తము సమీపింపగా, పెళ్ళికై (కౌతుక) ఉత్సాహ మును కలిగించు పెళ్ళివేషమును ధరించిన ఓరామా! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**20. భార్గవదర్పవినాశక రామ !**

**అర్థము : "నాగవల్లి నిష్ఠూరము" అనుమాట ప్రకా రము పెళ్లి అయిన తరువాత ఒక పోట్లాట రావలెనట ! అందువలననే శ్రీరామ కళ్యాణానంతరము రామునితో పోరాడుటకు వచ్చిన భార్గవ=పరశురాముని యొక్క, దర్ప= గర్వమును, వినాశక=నశింపజేసిన, ఓ శ్రీరామా! నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



**21. శ్రీమదయోధ్యాపాలక రామ !**

**అర్థము : శ్రీమదయోధ్యా=భగవత్ సంబంధము కల అయోధ్యానగరమును పరిపాలించిన ఓరామా ! నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : మిథిలానగరములో సీతను పెండ్లి చేసికొని గృహప్రవేశమునకై తన దేశమునకు వచ్చి అయోధ్యకు రాజైన వానిని తలచినాడు.

ఈ 21 నామములలో బాలకాండ యొక్క సారాం శము అందింపబడినది. ఇక అయోధ్యా కాండము లోనికి ప్రవేశింతము.

**అయోధ్యాకాండము**

**22. అగణితగుణగణభూషిత రామ !**

**అర్థము : అగణిత = లెక్కించుటకు వీలుకానన్ని ఎక్కువ, గుణగణ = మంచిగుణములతో, భూషిత = అలంకరింపబడిన ఓ రామా ! నిన్ను స్తుతించుచు న్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : సీతారాముల వైవాహిక జీవితము హాయిగా సాగుచుండగా అయోధ్యపుర ప్రజలందరు శ్రీరాముని అనంత గుణములను ప్రశంసించిరి.



**23. అవనీతనయాకామిత రామ !**

**అర్థము : అవనీతనయా=భూపుత్రియైన సీత చేత, కామిత = ప్రేమింపబడిన లేక కోరబడిన ఓ రామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

వ్యాఖ్య : సీతారాముల అన్యోన్య దాంపత్యము ఈ నామమునందు సూచింపబడినది.

**24. రాకాచంద్రసమానన రామ !**

**అర్థము : రాకా=పూర్ణిమనాటి, చంద్రసమ = చంద్రునివంటి, ఆనన=ముఖముతో, ఆనందింపజేయు ఓరామా! నేను నిన్ను, స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : రాముడు అనగా రంజింపజేయువాడు, ఆనందింపజేయువాడు అని అర్థము. 22వనామములో గుణములచేతను, 23వనామములో రూపసౌందర్యము చేతను, ప్రజలను, భార్యయైన సీతను ఆకర్షించినట్టే లోకములందలి సర్వజనులను, తన ముఖ చంద్రునితో ఆనందింప జేయువాడితడే. అని భావము.

**25. పితృవాక్యాశ్రితకానన రామ !**

**అర్థము : పితృవాక్య=తండ్రిమాటవలన ఆశ్రిత= ఆశ్రయింపబడిన, కానన=అడవికల (దండకారణ్యము నకుచేరిన) ఓరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : "రామఃసత్యపరాక్రమ" అని వాల్మీకి ఎప్పుడు శ్రీరాముని ప్రశంసించు చుండును. అట్టి రాముని సత్య దీక్షకు ఉదాహరణము ఈ నామము.

**26. ప్రియగుహవినివేదితపద రామ !**

**అర్థము : ప్రియగుహ = తన ప్రియమిత్రుడైన గుహుని, వినివేదితపద=పదములను సేవించిన వానినిగా చేసిన ఓ రామా ! నిన్ను నేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : అరణ్యవాసము ప్రారంభించినశ్రీరాముని మొట్టమొదటగా కలిసినవాడు, అతని ప్రియమిత్రుడైన గుహుడు.

**27. నావికధావితమృదుపద రామ !**

**అర్థము : నావిక=పడవలను నడుపు గుహుని చేత, ధావిత=కడుగబడిన, మృదుపద = మెత్తని పాదములుకల,**



**ఓరామా ! నిన్ను నేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : గుహుడుచేసిన శ్రీరామ పాదసేవ ఇందు వర్ణింపబడినది.

**28. తత్క్షాళితనిజమృదుపద రామ !**

**అర్థము : తత్=ఆ గుహునిచేత, క్షాళిత = కడుగ బడిన, నిజ=తనయొక్క, మృదుపద = మృదువైన పద ములు కల, శ్రీరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను, కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : 27వ నామమే మరల 28వ నామముగా పదముల మార్పుతో కూర్పబడినది.

**29. భరద్వాజముఖానందక రామ !**

**అర్థము : భరద్వాజముఖ = భరద్వాజ మహర్షి యొక్క ముఖమునకు (తనరాకచే) ఆనందక=సంతో షము కలిగించిన ఓరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**30. చిత్రకూటాద్రినికేతన రామ !**

**అర్థము : చిత్రకూటాద్రి = చిత్రకూట పర్వత ప్రాంతమునందు, నికేతన = పర్ణశాలను నిర్మించుకొని**



**నివశించిన ఓ రామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : "14సంవత్సరముల కాలము అరణ్య ములో సుఖముగా నివశించుటకు తగిన ప్రదేశము చిత్రకూటము" అని భరద్వాజ మహర్షిచెప్పగా శ్రీరాముడచ్చుట పర్ణశాలను నిర్మించుకొని నివసించెను.

**31. దశరథసంతత చింతిత రామ !**

**అర్థము : దశరథ=దశరథ మహారాజుచేత, సంతత= నిరంతరము,చింతిత=దుఃఖముతోచింతించిన తండ్రికల ఓరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. నన్ను కరుణిం పుము.**

వ్యాఖ్య : ఈ నామమునందు దశరథుని మరణ వార్త సూచింపబడినది. వనవాసమునకు బయలుదేరిన కుమా రుని తలచుకొని, దశరథుడు పరితపించెను.

**32. కైకేయీ తనయార్థిత రామ !**

**అర్థము: కైకేయీ తనయ=కైక కొడుకైనభరతునిచేత, అర్థిత=1.రాజ్యమును స్వీకరింపుమని 2.లేనిచో ప్రతి నిధిగా పరిపాలించుటకు పాదుకలైనను ఇమ్మని కోరబడిన ఓరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



వ్యాఖ్య : దశరథ మరణానంతరము రాజ్యపాలనము సమ్మతింపని, రాముని సత్యదీక్షయును, భరతుని ధర్మదీక్ష యును ఇందు వివరింపబడనవి.

**33. విరచితనిజపితృకర్మక రామ !**

**అర్థము : పితృకర్మక=తండ్రికిచేయవలసిన పిండ ప్రదానాది పితృకర్మలను,విరచిత=నెరవేర్చిన ఓరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : శ్రీరాముని ధర్మమును పాటించుగుణము ఇందు పేర్కొనబడినది. భరతుని ద్వారా తండ్రియొక్క మరణవార్తను వినిన తరువాత, ఆతనికి పితృకార్య మును నిర్వర్తించి రాముడు తన ధర్మదీక్షను ప్రకటించి నాడు.

**34. భరతార్పితనిజపాదుక రామ !**

**అర్థము: భరత=భరతునికై అతని కోరికమేరకు, నిజ పాదుక=తనపాదుకలను, అర్పిత=అర్పించిన,ఓరామా! నేను నిన్నుస్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

ఈ నామముతో అయోధ్య కాండము పూర్తి అయినది.

**అరణ్య కాండము**

**35. దండకవనజనపావన రామ !**

**అర్థము : పితృవాక్య పరిపాలన దీక్షతో సీతా లక్ష్మణ సమేతుడై దండకారణ్యములోనికి ప్రవేశించి అచ్చట ముని**

జనులను నీదర్శన, స్పర్శన, సంభాషణములతో పవిత్రు లను చేసిన ఓరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**36. దుష్టవిరాధవిఖండన రామ !**

**అర్థము : దండకారణ్యమునందు విహరించుచు విరాధుడు అను రాక్షసుని ఖండించిన ఓరామా!నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : విరాధుడు 'జయుడు' అను ఒక గంధర్వుని కుమారుడు, శస్త్రాస్త్రములతో మరణము లేకుండ బ్రహ్మ నుండి వరమును పొందెను. అరణ్య మధ్యమున నడుచు చున్న రామలక్ష్మణులనుండి సీతను ఎత్తుకుపోవు చుండగా రామలక్ష్మణు లాతనిని భూమిలో పాతిపెట్టి ముందుకు సాగిరి.

**37. శరభంగ, సుతీక్ష్ణార్థిత రామ !**

**అర్థము : ఋషీశ్వరుల కోర్కెను తీర్చిన ఓరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : శరభంగుడు, సుతీక్ష్ణుడు అను ఇద్దరు ఋషీశ్వరులు ముందుగా శ్రీరాముని దర్శనమును, ఆ తరువాతమోక్షమును కోరినారు.



**38. అగస్త్యానుగ్రహవర్థిత రామ !**

**అర్థము : దండకారణ్యమునందు నివసించుచున్న అగస్త్య మహర్షియొక్క అనుగ్రహముచే వర్థిల్లిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**39. గృధ్రాధిపసంసేవిత రామ !**

**అర్థము : గ్రద్దల రాజైన జటాయువుచేత దశరథ కుమారులుగా సేవింపబడిన రామా ! నిన్ను నేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**40. పంచవటీతటసంస్థిత రామ !**

**అర్థము : పంచవటి ప్రాంతమునందు పర్ణశాలను నిర్మించుకొని, దండకారణ్యమునందు నివసించిన ఓ రామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**41. శూర్పణఖార్తివిధాయక రామ !**

**అర్థము : శూర్పణఖ ముక్కు చెవులను లక్ష్మణుని ద్వారా కోయించి, దానికి దుఃఖమును కలిగించిన ఓ శ్రీరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



వ్యాఖ్య : రావణుని సోదరియగు శూర్పణఖ శ్రీరా ముని దివ్యసౌందర్యమును చూచి మోహించి, అతనిని వివాహమాడి ఆనందింప దలచినది "తానొ కటి తలచిన దైవ మొకటి తలచునను న్యాయము ప్రకారము ఆమె కోర్కె విఫలమగుటయేకాక విరూపమును కూడ పొందినది.

**42. ఖరదూషణముఖమారక రామ !**

**అర్థము : ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు అను రాక్షస సేనానాయకులను ససైన్యముగా అవలీలగా మట్టుపెట్టిన ఓరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : తన ముక్కు చెవులను కోసిన వారిపై ప్రతీకారము తీర్చుకొనుటకై శూర్పణఖ ప్రేరేపింపగా, తనపైకి ఒక్కుమ్మడిగా వచ్చిన ఖరదూషణాది 14 వేల మంది రాక్షసుల నొక్క వేటుతో సంహరించిన శ్రీరాముని పరాక్రమీ నామమునందున్నది.

**43. సీతాప్రియహరిణానుగ రామ !**

**అర్థము : సీత కిష్టమైన ఆ మాయలేడిని తెచ్చి యిచ్చుటకై దాని వెంటపడి పరుగెత్తిన ఓ శ్రీరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



వ్యాఖ్య : సీతాహరణ ఘట్టమునకు నాంది పలుకు నది ఈ నామము. మాయలేడి ఇటునటు వనము నందు తిరుగాడుచుండగా సీతకు దానిపై మోజు కలిగినది. దానిని తెచ్చుటకై బయలుదేరిన రామునకు భార్యపైగల ప్రేమ ఇచ్చట వివరింపబడి నది.

**44. మారీచార్తికృదాగ్రహరామ !**

**అర్థము : మారీచునకు ప్రాణార్తిని కలిగించు కోపము గల, ఓరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య: 43వనామములో పేర్కొనబడినమాయలేడిగా వచ్చినదితాటక. కుమారులలో ఒకడైన మారీచుడు. వానిని సంహరించుటలో శ్రీరాముని కోప ప్రభావమిందున్నది.

**45. వినష్టసీతాన్వేషక రామ !**

**అర్థము : అపహరింపబడిన సీతను వెదికిన ఓ రామా ! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : (మారీచుని) బంగారులేడిని తెచ్చుటకై రాముడు సీతనుండి దూరముకాగానే రావణుడు కపట సన్యాసివేషమునవచ్చి సీతను అపహరించినాడు. ఆ సీతకై

వెదకుచు రాముడు తన భార్యా ప్రేమను, మానవత్వమును ప్రకటించినాడు.

**46. గృధ్రాధిపగతిదాయక రామ !**

**అర్థము : జటాయువునకు సద్గతిని ప్రసాదించిన ఓరామా ! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : రావణుడు సీత నపహరించుకొని పోవు చుండగా ఆమెను రక్షించుటకై గ్రద్దల రాజైనజటాయువు రావణునితో యుద్ధముచేసి, మరణించుటకు సిద్ధముగా ఉండెను. సీతను వెదకికొనుచు వచ్చి, రామలక్ష్మణులు కొన ఊపిరితో ఉన్న, జటాయువు ద్వారా సీతజాడను తెలిసికొనిరి. తన చేతిలో మరణింపగా, ఆ జటాయు వును స్వర్గమునకు పంపుచు శ్రీరాముడు తన దివ్యత్వ మును ప్రకటించినాడు.

**47. శబరీదత్త ఫలాశన రామ !**

**అర్థము : వయోభారమును కూడ పరిగణింపక, శ్రీరామాగమమునకై వేచియుండి తాను సేకరించిన పండ్లను తినిన ఓ రామా ! నిన్ను నేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



వ్యాఖ్య : భక్తితో ఏమిచ్చినను స్వీకరింతునను తన ప్రమాణమును అమలు పరచుటకై శ్రీరాముడు శబరిని అనుగ్రహించిన ఘట్టమిది.

**48. కబంధబాహుచ్ఛేదన రామ !**

**అర్థము : కబంధుడను రాక్షసుడు తన పొడుగైన బాహువులతో రామలక్ష్మణులనుపట్టి మ్రింగజూడగా, వాని బాహువులను ఖండించి, తాము వాని నుండి ముక్తులై, వానికి మోక్షము నిచ్చిన ఓరామా ! నిన్ను నేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**కిష్కింధాకాండము**

**49. హనుమత్‌సేవిత నిజపద రామ !**

**అర్థము: హనుమంతునిచే సేవింపబడిన పాదములు కల ఓ శ్రీరామా! నిన్ను నేను సేవించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : సీతాన్వేషణమునకై బయలుదేరిన రామ లక్ష్మణులు వానర నివాసమైన కిష్కింధానగరమును ప్రవే శింపగనే, సుగ్రీవుని దూతగా హనుమంతుడు మొట్టమొదటి సారి శ్రీరాముని దర్శించెను. ఆ ప్రథమ సమాగమముననే శ్రీరాముడు“హనుమా” అనిపేరుపెట్టి పిలువగనే ఆంజ నేయుడు ఆతనికి దాసాను దాసుడై, శ్రీరాముని సేవించెను.



**50. నతసుగ్రీవాభీష్టద రామ !**

**అర్థము : హనుమంతుని ప్రేరణము వలన సుగ్రీవుడు శరణు పొందగా తనకు ప్రణమిల్లిన ఆ సుగ్రీవునకు ఇష్టమైన భార్యను, రాజ్యమును, వాలిని గెలిచి ఇచ్చిన ఓ శ్రీరామా! నిన్ను నేను సేవించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**51. గర్వితవాలి సంహారక రామ !**

**అర్థము : ఎదుట నిలబడి యుద్ధము చేయువాని బలములో సగభాగమును స్వీకరింపగల శక్తితో గర్వించి సోదరుడైన సుగ్రీవుని భార్యను, రాజ్యమును అపహరించిన వానర నాయకుడైన వాలిని చెట్టు మాటునుండి సంహరిం చిన ఓ రామా! నిన్నునేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**52. వానరదూతప్రేషక రామ !**

**అర్థము : జటాయువుద్వారా సీత వెళ్లిన దిక్కును తెలిసికొని, సుగ్రీవుని ద్వారా సీతయొక్క ఆభరణమును దర్శించి, సీతాన్వేషణమునకై నాల్గుదిక్కులకు, వానర నాయకులను, ప్రత్యేకముగా తన అంగులీయకమును ఇచ్చి, దాని వృత్తాంతమును చెప్పి, దక్షిణ దిక్కునకు హనుమదాది**



**వానరవీరులను పంపించిన ఓ రామా ! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

**53. హితకరలక్ష్మణసంయుత రామ !**

**అర్థము : సీత దక్షిణ దిశయందున్నదని తెలిసికొని ఆమెను వెదకు ప్రయత్నములో, గంపెడు దుఃఖదశలో ఉన్న శ్రీరామునకు మేలు చేయునట్టి లక్ష్మణునితో కూడి యున్న ఓరామా ! నిన్ను నేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**సుందరకాండ**

**54. కపివరసంతత సంస్మృత రామ !**

**అర్థము : హనుమచే నిరంతరము స్మరింపబడిన ఓ శ్రీరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : ఈ నామముతో సుందరకాండ ఆరంభింప బడుచున్నది. శ్రీరాముడు సుందరుడు, సీత సుందరి, వారి కథ సుందరము. సీతను వెదికిన హనుమంతుడు సుంద రుడు. హనుమంతుడు వెదికిన లంకా నగరము, అశోక వనముకూడ సుందరములే. అందు వలననే ఈ కాండకు సుందరకాండ అనిపేరు వచ్చినది. సుగ్రీవుని ఆజ్ఞచే

హనుమంతునితోను, జాంబ వంతునితోను, అంగదాదుల తోను కలసి సీతాన్వేషణ మునకై దక్షిణ దిక్కుననున్న లంకా నగమునుచేరి చిట్టచివరకు సీతను దర్శించి, ఆ వార్తను శ్రీరామునకు అందించినవాడు. హనుమంతుడు ఈ పనులను నిర్వర్తించునంత కాలము అతనిని పంపిన రాజసుగ్రీవుడు, తోటివానర వీరులందరును హనుమం తుని సంతతము స్మరించుచునే ఉన్నారు. ఇందరు ఇన్ని విధముల హనుమంతుని స్మరించునందున ఆ హనుమం తుడు తాను బయలుదేరిన కార్యము, నిర్విఘ్నముగా నెరవేరి, తత్ఫలముగా సీతాదర్శనము కావలెనని తన ప్రభువగు శ్రీరామచంద్రుని సంతతము స్మరించినాడు.

**55. తద్గతివిఘ్న ధ్వంసక రామ !**

**అర్థము : హనుమకు కార్యసిద్ధిని కలిగించిన ఓ శ్రీరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : సీతాన్వేషణమునకై బయలుదేరిన హను మంతుడు సీతాదర్శనము చేయులోపుగా 4 ఆటంక ములు ఏర్పడినవి అవి 1. నిరాలంబమైన ఆకాశమున సుమారు నూరు యోజనములు సముద్రమార్గమును దాటవలసి



వచ్చెను. హనుమంతుడు దీనిని ధృతితో= ధైర్యముతో దాటెను. ఆ ధైర్యము నిచ్చినవాడు శ్రీరా ముడే. 2. మైనా కుడు – కాలవిలంబనము చేయు విఘ్నమును, విశ్రాంతి తీసుకొనవలెనను ఆశను, గౌరవమందుకొను ఆశను, విఘ్నముగా కల్పించినాడు. దానిని శ్రీరామానుగ్రహముచే హనుమ తన దృష్టితో అధిగమించినాడు. లక్ష్యసాధనమే దృష్టి. "అది విశ్రాంతి గౌరవాదులవైపురాదు" అని ముందుకు సాగినాడు. 3. సురస–ఇది హనుమను మ్రింగి విఘ్నమును కలిగించు జూచినది. దీనిని తన మతి (జ్ఞానము)తో అధిగమించెను. 4.సింహిక–ఇది ఛ్చాయా గ్రాహకశక్తి కలదై, హనుమయొక్క నీటిలో ప్రతిబింబించు చున్న నీడనుబట్టి క్రిందికి దిగలాగి, విఘ్నమును కలిగిం చెను. దీనిని తన దాక్ష్యము (సామర్థ్యము)తో హనుమ అధిగ మించెను. హనుమకు ఆయా శక్తులనిచ్చి విఘ్నము లను ధ్వంసము చేసినది శ్రీరాముని అనుగ్రహశక్తియే.

**56. సీతాప్రాణాధారక రామ !**

**అర్థము : సీత ప్రాణములకు ఆధారమైన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



వ్యాఖ్య : తననుఅశోకవనమున బంధించి, "నన్ను వివాహము చేసికొమ్మ"ని రావణుడు నిర్బంధించు చుండగా సీత తనజడనే ఉపయోగించి ఉరివేసి కొని మరణింప దలచెను. ఆసమయమునకే హనుమ అచ్చటికిచేరి శ్రీరామ కుశలవార్తను తెలిపి, సీతను ఆ ప్రయత్నము నుండి విర మింపజేసెను. శ్రీరామకథను ఆ క్షణమున ఆ సీత విన కున్నచో మరణించి యుండెడిది. కనుక ఆరామకథ సీతా ప్రాణాధారకమైనది.

**57. దుష్టదశాననదూషిత రామ !**

**అర్థము : దుష్టుడైన రావణునిచే దూషింపబడిన ఓ శ్రీరామా ! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : పదితలల రావణాసురుడు, సీతను అశోక వనమునందు బంధించియుంచి, ఆమె తనను వివాహ మాడుటకు అంగీకరింపనపుడు, ఆమె మనస్సును మార్చు టకై శ్రీరాముని, "మానవమాత్రుడనియు, భార్యను రక్షించు కొనలేని అసమర్థుడనియు, రాజ్యభ్రష్టుడనియు నిందిం చెను. మరల హనుమంతుని ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముతో బంధించి తన సభకు తేగా, అతనితో "శ్రీరాముడు భార్యను



రక్షించుకొనలేని అసమర్థు"డని నిందించెను. భగవన్నింద దుష్టకార్యము.

**58. శిష్టహనూమద్భూషిత రామ !**

**అర్థము : హనుమంతునిచే ప్రశంసింపబడిన ఓ శ్రీరామా! నిన్ను నేను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : భగవంతునిపై శ్రద్ధా భక్తులు కలిగి, అతని కార్యమునకుపయోగపడువాడు శిష్టుడు. అట్టి శిష్టుడైన హనుమంతునిచే శ్రీరాముడు ప్రశంసలతో రావణుని వద్ద అలంకరింపబడినవాడు.

**59. సీతావేదితకాకావన రామ !**

**( కాకప రామ )**

**అర్థము : సీతమ్మచేత అనుగ్రహము చూపబడిన కాకాసురుని రక్షించిన ఓ శ్రీరామా ! నిన్ను నేను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : సీతారాములకు మాత్రమే తెలిసిన, కాకా సుర వృత్తాంతమును శ్రీరాముడు హనుమకు చెప్పగా, తాను రామదూత అని సీతను నమ్మించుటకు హనుమ ఆ వృత్తాంతమును సీతకు చెప్పును.

**60. కృతచూడామణిదర్శన రామ !**

**అర్థము : చూడామణిని చూచినంతనే సీతను చూచి నట్లుగా భావించిన ఓ శ్రీరామా, నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : లంకలో నున్న సీతను చూచి అశోకవన మును ధ్వంసముచేసి, రావణుని దర్శించి, లంకను దహించి మరల శ్రీరాముని సమీపించి, హనుమ సీతను చూచివచ్చుటకు, ఆనవాలుగా ఆమె ఇచ్చిన చూడా మణిని శ్రీరామునకిచ్చెను.

**61. కపివరవచనాశ్వాసిత రామ !**

**అర్థము : "దృష్టా సీతామయా" సీతను నేను చూచి వచ్చితిని అను వానర నాయకుడైన హనుమంతుని మాటచే ఊరడిల్లిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**యుద్ధకాండము**

**62. రావణనిధనప్రస్థిత రామ !**

**అర్థము : రావణసంహారమునకై లంకకు బయలు దేరిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**



వ్యాఖ్య : హనుమంతుని ద్వారా సీతలంకలో ఉన్న దన్న వార్తను రూఢిపరుచుకొని, హనుమత్కృత రామ పరాక్రమ వర్ణనమును రావణు డంగీకరింపకపోగా, ఇక తప్పని సరియైన పరిస్థితిలో రావణ సంహారమునకు శ్రీరా ముడు బయలుదేరెను.

**63. వానరసైన్యసమావృత రామ !**

**అర్థము : వానరసైన్యముతోకూడి వారి మధ్య నుండి యుద్ధమునకు బయలుదేరిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : యుద్ధమునకు శ్రీరాముడు సన్నద్ధుడు కాగా, సుగ్రీవుని వానరసైన్యమంతయు అతని ఆజ్ఞచే రాముని వెంట యుద్ధమునకు నడువసాగినది.

**64. శోషితసరిదీశార్థిత రామ !**

**అర్థము : సముద్రునిచే ప్రాణరక్షణకై ప్రార్థింప బడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : యుద్ధమునకు సిద్ధమై శ్రీరాముడు లంకకు జేరుటకై దక్షిణదిశగా సాగుచు సముద్రతీర మును చేరెను. అచ్చట మూడురోజులపాటు దర్భశయనమున పరుండి,



లంకకు ససైన్యముగా తాను చేరుటకు దారినీయవలసి నదిగా సముద్రుని కోరెను. అతడు దారిని ఇవ్వలేదు. కనుక సముద్రునిపై కోపించి "నీలోని నీటి నింకింపజేసి, కేవలస్థల మాత్రునిగా చేసెదను" అని రాముడు ఆగ్నేయా స్త్రమును సంధించెను. దానితో భయపడి, సముద్రుడు ప్రత్యక్షుడై, ప్రాణరక్షణకు ప్రార్థించెను.

**65. విభీషణాభయదాయక రామ !**

**అర్థము : విభీషణునకు అభయము నిచ్చిన శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : దుర్మార్గులకు హితబోధలు చెవికెక్కవు కదా! కనుకనే యుద్ధప్రారంభ సమయమునందు విభీషణుడు రావణునితో, "రామునకు సీతనప్పగించి, నిన్ను, బంధు మిత్రులను, నీరాజ్యమును కాపాడుకొను"మని హితవు పలికెను. ఆమంచి మాటలను పెడచెవినిపెట్టి, రావణుడు విభీషణుని దేశబహిష్కృతుని చేసెను. అందువలన విభీష ణుడు శ్రీరాముని శరణు కోరెను.

**66. పర్వతసేతు నిబంధక రామ !**

**అర్థము : సముద్రుని సలహా మేరకు, లంకానగ రములోనికి వెళ్ళుటకై, వానరవీరుల ద్వారా పర్వతము**



**లను తెప్పించి, వానితో సేతువును (వంతెనను) నిర్మిం చిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**67. కుంభకర్ణశిరశ్ఛేదక రామ !**

**అర్థము : ఘోరయుద్ధమునందు, రావణుని తమ్ము డైన కుంభకర్ణుని తలనరికిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**68. రాక్షససంఘవిమర్దక రామ !**

**అర్థము : రాక్షససమూహమును యుద్ధభూమిలో మర్దించి, నశింపజేసిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**69. అహిమహిరావణచారణ రామ !**

**అర్థము : అహిరావణుడు, మహిరావణుడు అను రాక్షసులను తనవైపునకు నడిపించుకొనిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

**70. సంహృతదశముఖరావణ రామ !**

**అర్థము : రామావతార ప్రయోజనము రావణ సంహా రమే. కనుక ఆ దశముఖములుకల రావణుని సంహరిం**

చిన ఓ శ్రీరామా ! నేను నిన్నుస్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**71. విధిభవముఖసురసంస్తుత రామ !**

అర్థము : అవతార ప్రయోజనము పూర్తికాగానే బ్రహ్మ, శివుడు మొదలగు దేవనాయకులచే స్తుతింప బడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**72. ఖస్థితదశరథ వీక్షిత రామ !**

అర్థము : శ్రీరామ విజయము నందరు అభినందించుచుండగాచూచి, ఆనందముతో, ఆకాశమున నుండి తండ్రియగు దశరథునిచే చూడబడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**73. సీతాదర్శనమోదిత రామ !**

అర్థము : యుద్ధవిజయానంతరము, అగ్నిపునీత యగు సీతనుచూచి, ఆనందించిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**74. అభిషిక్తవిభీషణనత రామ !**

అర్థము : విభీషణునకు సామ్రాజ్య పట్టాభిషేకము చేసి, అతనిచే నమస్కరింపబడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.



వ్యాఖ్య : యుద్ధమునకు పూర్వమే విభీషణునకు పట్టము కట్టుదునని శ్రీరాముడాతనికభయమునిచ్చెను. యుద్ధవిజయానంతరము నీ సత్యదీక్షను కాపాడు కొనుచు విభీషణునకు లంకాసామ్రాజ్యమున పట్టాభిషేకమును చేయగా విభీషణుడు కృతజ్ఞతతో రామునకు వందనము చేసెను.

**75. పుష్పకయానారోహణ రామ !**

అర్థము : లంకనుండి అయోధ్యకు మరలివచ్చు టకై పుష్పకవిమానమును సీతాసహితుడవై ఎక్కిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**76. భరద్వాజాభినిషేవణ రామ !**

అర్థము : అయోధ్యకు మరలివచ్చు దారిలో భరద్వాజ మహర్షి ఇచ్చిన ఆతిథ్యమును, విందును స్వీకరించుటతో అతనిచే సేవింపబడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణిం పుము.

**77. భరతప్రాణ ప్రియకర రామ !**

అర్థము : భరతుని ప్రాణములను కాపాడి, నీ దర్శనముచే అతనికి ప్రియమును కలిగించిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.



వ్యాఖ్య : 14 సంవత్సరముల గడువు పూర్తికాగానే శ్రీరాముడు రాకున్నచో భరతుడు “అగ్నిప్రవేశము ద్వారా ప్రాణత్యాగమును చేసెద”నని ప్రతిజ్ఞ చేసెను. ఆతని ప్రాణములను కాపాడుటకై, పుష్పకముపై సకాలములో అయోధ్యకు శ్రీరాముడు చేరెను.

**78. సాకేతపురీభూషణ రామ !**

అర్థము : వనవాసమునుండి తిరిగివచ్చి అయోధ్యా పురమునకు భూషణమైనవాడా ! శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.

వ్యాఖ్య : సాకేతమనగా అయోధ్యానగరము.

**79. సకల స్వీయసమానత రామ !**

అర్థము : పట్టాభిషేకము చేసికొని పట్టాభిరాముడవై నందువలన, సర్వస్వీయులచేత (అనగా నీవారైన బంధుమిత్రులందరిచేత) బాగుగా నమస్కరింపబడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**80. రత్నలసత్పీఠస్థిత రామ !**

అర్థము : పట్టాభిషేకానంతరము రత్న సింహాసనముపై కూర్చొని ఉన్న ఓశ్రీరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.



**81. పట్టాభిషేకాలంకృత రామ !**

అర్థము : పట్టాభిషేకమునకై చక్కగా అలంకరించుకొనిన, లేక పట్టాభిషేకము చేతనే అలంకరింపబడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**82. పార్థివకులసమ్మానిత రామ !**

అర్థము : భూమండలము నందలి రాజు లందరి చేతను క్షత్రియసంఘము చేతను సన్మానింపబడిన ఓ శ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

**83. విభీషణార్పితరంగక రామ !**

అర్థము : విభీషణునిచే రంగవల్లులు అర్పింప బడిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.

వ్యాఖ్య : తనకు పట్టాభిషేకము చేసినందువల నను, శ్రీరాముడు యుద్ధమునందు జయించుట వలనను, విభీషణుడు శ్రీరామునకు విజయోత్సవమును చేయనెంచెను. అందలి భాగముగా స్వాగతమును చెప్పుటకై తన రాజ్యము నందంతటను రంగవల్లులనురచించి వానిని శ్రీరామునకు సమర్పించెను.

**84. కీశకులానుగ్రహకర రామ !**

**అర్థము : యుద్ధమునందు తనకు తోడ్పడినందుకు కృతజ్ఞతా భావముతో, పట్టాభిషేకానంతరము, వేరు వేరున వానర నాయకుల నందరిని పిలిచి, పారితోషికములతో అనుగ్రహించిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**85. సకల జీవసంరక్షక రామ !**

**అర్థము : రామరాజ్యమును స్థాపించుట ద్వారా సర్వ జీవులను సంరక్షించిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**86. సమస్తలోకాధారక రామ !**

**అర్థము : సర్వేశ్వరుడవైన శ్రీమన్నారాయణుడుగా నీవు కేవలము భూలోకమునకే కాదు సమస్తలోకము లకు, సర్వకర్మ ఫలములకును ఆధారభూతుడవైన ఓశ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

**ఉత్తర కాండము**

**87. ఆగతమునిగణసంస్తుత రామ !**

**అర్థము: శ్రీరాముడు రాజ్యమును పాలించు చుం డగా ఆతని దర్శనార్థమై మునీశ్వరులందును ఒకసారి**



**ఆతని వద్దకు వచ్చి చేరిరి. ఆ మునీశ్వరబృందముచే ప్రస్తు తింపబడిన ఓశ్రీరామా! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**88. విశ్రుతదశకంఠోద్భవ రామ !**

**అర్థము : ఆ ఋషీశ్వరులవలన రావణుని పుట్టుక మొదలగు జన్మవృత్తాంతమును వినిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

**89. సీతాలింగననిర్వృత రామ !**

**అర్థము : రావణుని చెరనుండి బయటపడి, అగ్ని పునీతయగు మహాసాధ్వి సీతను రాజ్యాభిషేకానంత రము ఆలింగనముచేసికొని, ఆనందించిన ఓశ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణిం పుము.**

**90. నీతిసురక్షితజనపద రామ !**

**అర్థము : ధర్మయుక్తమైన, నీతిమంతమైన రాజ్య పాలనముతో రాజ్యమును పరిపాలించిన ఓశ్రీరామా! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**91. విపినత్యాజిత జనకజ రామ !**

**అర్థము : పట్టాభిషేకము జరిగి కొంతకాలము కాగా ఒక చాకలివాని మాటనువిని, రాజనీతి ప్రకారము సీత**



**మ్మను అరణ్యములో విడిచి పెట్టించిన ఓశ్రీరామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

**92. కారితలవణాసురవధ రామ !**

**అర్థము : శత్రుఘ్నునిచేత లవణాసురవధ చేయిం చిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించుచున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : లవణాసురుడు మధుకైటభులలో మధువను వాని కుమారుడు, మహాదుష్టుడు. వీని పినతల్లి కుంభీనస. ఇతని పినతండ్రికి శివుడు ప్రసాదించిన శూలమును ఇతని తండ్రి వీని కిచ్చెను. అదిచేతిలో ఉన్నంతవరకితడ జేయుడు. ఆశూలముతో ఈతడు మునులను బాధించెడి వాడు. వీనికి దినమునకు 100ఏనుగులు, 200 గుఱ్ఱ ములు, 600పశువులు, 1000 దుప్పులు ఆహారము. వీని దుండగములను భరింపలేక చ్యవనాదిమహర్షులు శ్రీరా ముని శరణుజొచ్చిరి. లవణసంహారమును నేను గావించెద నని శత్రుఘ్నుడు ముందుకు వచ్చెను. మధుకైటభవధకై బ్రహ్మ నిర్మించిన ఆయుధము శ్రీరామునివద్ద ఉండెను. రాముడు దానిని శత్రుఘ్నునకిచ్చి దానిని ప్రయోగించుటకు, ఉపసంహరించుటకు కావలసిన మంత్రములను బోధించి,



"లవణుని చేతిలో శూలము లేనప్పుడు దీనిని ప్రయో గింపు"మనెను. శత్రుఘ్నుడులవణున కెదురుపడి, శూలము లేనప్పుడు శ్రీరాముడిచ్చిన అస్త్రముతో లవణుని వధించెను.

**93. స్వర్గతశంబుకసంస్తుత రామ !**

**అర్థము : మరణించిన శంబుకునిచే ధర్మరక్షా విషయ మున స్తుతింపబడిన ఓ శ్రీరామా ! నేను నిన్ను స్తుతించు చున్నాను. కనుక నన్ను కరుణింపుము.**

వ్యాఖ్య : శంబుకుడను వాడొక శూద్రముని, తన జాతి విరుద్ధమైన తపస్సుచేసి ఇంద్రలోకమునకు పో గోరెను. ఆతని అధర్మ ప్రవర్తనమునకు ఫలితముగా ఒక బ్రాహ్మణ బాలకుడు మరణించెను. ఆ బాలుని తండ్రి శవమును భుజముపై వేసికొనివచ్చి శ్రీరాముని ఆస్థాన ములో ధర్మరక్షణమును కోరెను. ఆ బ్రాహ్మణ బాలుని రాజుగా రక్షింపదలచిన శ్రీరాముడు అరణ్య మునకేగి శంబుకుని తలనరికెను. బ్రాహ్మణ బాలుడు జీవించెను. ఈ విధముగా ధర్మరక్షణమునకై శ్రీరా ముడు శంబుకుని చంపగా ఆ మరణించిన శంబుకుడు స్వర్గమునందుండియే శ్రీరాముని ధర్మదీక్షను ప్రశంసించుచు ఆతనిని స్తుతించెను.

